

## రచయితను గూర్చి

జననం: 192[illegible]లో. జన్మస్థలం: కడప జిల్లా, వెంకటరాజుపల్లి. విద్యాభ్యాసం: రాజంపేట బోర్డు హైస్కూల్. అనంతపురం ఆర్ట్స్ కాలేజి, వాల్తేరు ఆంధ్ర విశ్వవిద్యాలయం, తెలుగు ఎం. ఏ., హిందీ విశారద; డాక్టరేట్ బిరుదు S V వెంకటేశ్వర యూనివర్సిటీ; ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల ప్రత్యేకాధికారి. సెక్రటేరియట్.

కావ్యములు : (కం)కాళరాత్రి. నవసృష్టి

నవలలు: ఆదర్శం భావం, స్వగతం, సంసారం, ప్రేమభిక్ష, శోభాదేవి, శంపాలత, చీకట్లో కాంతిరేఖలు, రామరాయలు,

పిల్లల నవలలు: కోట వీరన్న సాహసం, ఉదయగిరి పోలన్న ధైర్యం, మంతాల రామన్న మొండితనం, కవిగారి బాల్యం.

నాటికాలు: సహజీవనం, సమరసత్వం, మానవత్వం పరిష్కారం, భువన విజయం, ఎక్కడిది గొంగడి అక్కడనే.

పరిశోధన: ప్రబంధములలో ప్రకృతి వర్ణన.

కృతి స్వీకర్త

# శ్రీ జాగర్లమూడి వీరాస్వామి



సుకుమార దేహుండు
సువిశాల హృదయుండు
అంతరాంతర బాహ్య
సౌందర్య కలితుండు

ఉన్నత విద్యలనుపొంది
ఉన్నత ఉద్యోగియయ్యె
ఉన్నవాడు లేనివాడు
అన్న భేదమే తలపడు

సాంస్కృతికరంగాన
సమ్యక్ నటాగ్రసరు
డసలు జీవితమందు
నటనమెరుగని వాడు

వరసతి మహాలక్ష్మమ్మకు
వీరాస్వామికి నాకృతి
నవసృష్టిని షష్టిపూర్తి
కందించితి కానుకగా.

# ఒక మాట

పాతికేళ్లు పైగా కవి సమ్మేళనాల్లో పాల్గొంటూనే వున్నాను. కవితలను పత్రికలలో ప్రకటిస్తూనే వున్నాను. రేడియోలో పఠిస్తూనే వున్నాను. కాని యింతవరకూ వాటికి పుస్తకరూపాన్నివ్వలేదు. ఇంతకాలానికి కొన్ని గేయాలను మాత్రం గ్రంథ రూపంలో వెలువరిస్తున్నందుకు సంతోషం.

కవితారూపం యెట్లావుండాలన్నది చర్చనీయాంశం కానక్కరలేదు.

రూపంకాదు ప్రధానం, కవితావేశం

అంతేకాదు దాన్ని ఆవిష్కరించే విధానం

గేయకవిత వ్రాయడం కష్టమైన పని. వచన కవితలో ఛందస్సు వుండదు. గేయకవితలో మాత్రా ఛందస్సుంటుంది. ఆదిలోనో అంతంలోనో యతిప్రాసలు గూడా పాటింపబడతాయి. చిన్నచిన్న పాదాలు గలిగివుండటమూ, అందులో యతిప్రాసలు పాటింపబడడమూ, భాష సులభ వ్యావహారికంలో వుండటమూ దీనికిగల కష్టాన్ని పెంచుతాయి.

గేయ కవితలో భావ విస్తృతి, భాషా సంయమనమూ తప్పవు. అదే పద్య రచన అయితే ఒక చిన్నభావంచుట్టూ బ్రహ్మాండమైన సమాసాల రూపంలో భాష సంచరిస్తుంది. గేయంలో పెద్దభావం చుట్టూ సార్థకమైన చిన్న పదాల ప్రయోగం వుంటుంది. ఎందుకంటే అది పండిత పామరులకు సైతం అర్థం కావాలి గాబట్టి. ప్రయోజనం యివ్వాలి కాబట్టి.

ప్రోత్సాహమిచ్చిన అనేక మిత్రులతో పాటు అండగా నిల్చి అత్యల్ప కాలంలో ముద్రించి యిచ్చిన వెంకట్రామా పేపరు ప్రొడక్ట్స్ యం. మురళీకృష్ణగారికీ, టైటిల్ వేసిన శీలావీర్రాజు గారికీ ఇంకా అనేక విధాలుగా సాయపడుతున్న బుడ్డిగ సుబ్బరాయన్ గారికీ కృతజ్ఞుణ్ణి.

వివేచనాశీలుడూ, వినయవంతుడూ, బాహ్యాంతర సౌందర్యయుతుడూ విద్యాధిక ఉన్నతోద్యోగి అయిగూడా గర్వమిసుమంత గూడా లేనివాడూ అయిన జాగర్లమూడి వీరాస్వామి గారికి ఆయన షష్టిపూర్తి సందర్భంగా యీ గ్రంథాన్ని అంకితమిస్తున్నందుకు ధన్యుణ్ణి.

# నవసృష్టి

సృష్ట్యాదినుండి చూ
స్తున్నాను యీ సృష్టి
ఇది పాపభూయిష్ఠ
మిది దుష్ట ధిష్ణ్యమ్ము

అలవేదములనాడు
ఆర్యాభి నిర్యాణ
ఫలముగా ద్రావిడుల
వధ బలిసిపోయినది

అలవర్ణ ధర్మమ్ము
తొలినాడు ద్రావిడుల
రాక్షసులజేసి ని
ర్వాసనము చేసినది

అలనాడు బౌద్ధ ధ
ర్మాల పాలించు నే
తల రాక్షసులజేసి
క్షణన గావించినది

ఆనాడు జంతుబలీ
యజ్ఞాలు పాపాల
టంచు చాటిన బౌద్ధు
లను బట్టి చంపినది

స్పృష్ట్యాదినుండి చూ
స్తున్నాను యీ స్పృష్టి
ఇది పాప భూయిష్ఠ
మిది దుష్ట ధిష్ణ్యమ్ము

తమకు లొంగని వారి
తనయులను కవ్వించి
తిరుగుబాటుల లేవ
దీసి చంపించినది.

ఇంటిగుట్టును రచ్చ
కీడ్చు స్వార్థుల గలిసి
కూటస్థులను జుట్టి
ఖూనీలు చేసినది.

తన మాట విననట్టి
ధరణి పాలురనెల్ల
మాయావతారాల
మోసాన చంపినది.

సమతయు నహింసా
ప్రచారమును కావించు
స్వేచ్ఛ ధర్మమును ని
ర్వాసనము చేసినది

సృష్ట్యాదినుండి చూ
స్తున్నాను యీ సృష్టి
ఇది పాపభూయిష్ఠ
మిది దుష్ట ధీషణ్యమ్ము

విద్య వస్తే తర్క
బుద్ధి పెరుగునటంచు
స్త్రీ శూద్ర విద్యా ని
షేధమును చేసినది.

వర్ణధర్మము కట్టు
బాటు తప్పిన వారి
నెల్ల అస్పృశ్యులను
చేసి నెట్టేసినది.

రాజులు పురోహితులు
రాహు సంకాశులై
చెడ్డ గూడుపుఠాణి
చేసివేసినది యిది.

సృష్ట్యాదినుండి చూ
స్తున్నాను యీ సృష్టి
ఇది పాపభూయిష్ఠ
మిది దుష్ట ధిష్ణ్యమ్ము

ఒక వైపు దౌర్జన్య
కారుల విజృంభణము
ఒక వైపు పీడితుల
అసహాయ రోదనము

ఒక వైపు దోపిడీ
దారుల దురాక్రమణ
ఒక వైపు వంచితుల
అసహాయ క్రందితము

ఒకవైపు ఆతతా
యీ జన విజృంభణము
ఒక వైపు వ్యసనార్త
జనుల హాహారవము

ఒక వైపు వర్ణవా
దుల ద్రోహదోహదము
ఒక వైపు వంచితుల
అసహాయ శోకమ్ము

ఒక వైపు జాతి వి
శ్లేషణా యత్నమ్ము
ఒక వైపు ఆత్మగౌ
రవహాని దుఃఖమ్ము

సృష్ట్యాదినుండి చూ
స్తున్నాను యీ సృష్టి
ఇది పాప భూయిష్ఠ
మిది దుష్ట ధిష్ణ్యమ్ము

ఇది సాగరాదింక
యిక సాగదీనీతి
యీ సృష్టి సర్వమ్ము
ధ్వంసమై పోనిమ్ము

ఒక్కుమ్మడిగ కోటి
భాస్కరులు చండ ప్ర
చండమై అగ్ని వ
ర్షమ్ములం గురియనీ

ఒక్క మొగిన ప్రభం
జనుడు విజృంభించి
హుంకార రవముతో
హోరెత్తి వీవనీ

ఒక్కమ్మడిగ బృహ
ద్ధారాధ రౌఘమ్ము
భయదమౌ పిడుగు మొ
త్తమ్ము వర్షింపనీ

ప్రళయకాలాభీల
విలయ ఝంఝూవాత
మఖిలమ్ము దుమ్ముగా
పై కెగురగొట్టనీ

విలయకాలా భీల
ఉల్లోల భయదమ్ము
అర్ణ వమ్ముప్పొంగి
ఘూర్ణిల్లి ముంచనీ

పోనిమ్ము నాశమై
పోనిమ్ము యీ సృష్టి
నవసృష్టి నాసగును ద
వానలాంతర వృష్టి



# ఉత్తిష్ఠ - ఉత్తిష్ఠ

తొలికోడి కూసింది
మేలుకో మేలుకో
మలికోడి కూసింది
మేలుకో మేలుకో
తెలవారి పోయింది
ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ
ఇరులు పోయిన దారి
పారి పోతున్నారు.
పట్టుకో పట్టుకో
పరుగెట్టి పట్టుకో ...ఎందుకు? ఎందుకు?

తరతరాలుగ మనల
ఇరులలో పడదోసి
దోషాత్ములై యెన్నొ
మోసాలు చేశారు
మోసాలు చేశారు ...ఏమీ, ఏమీ

హక్కుదార్లుగ కష్ట
జీవులను పట్టుకొని
రక్తాన్ని మాంసాన్ని
పీల్చి భక్షించారు
  పీల్చి భక్షించారు ...ఔనా, ఔనా,

ప్రాజెక్టులు కట్టినాము
పంటలు పండించినాము
ఇంతైనా దక్కకుండ
అంతాకొట్టేసినారు
  అంతాకొట్టేసినారు ...అన్యాయ్యం అన్యాయ్యం

మిద్దెలెన్నొ కట్టినాము
మేడలెన్నొ కట్టినాము
గుడిసెలలో మమ్ముతోసి
మేడ లాక్రమించినారు
  మేడలాక్రమించినారు...దురాక్రమణ,దురాక్రమణ

పరధనాల దోచి దోచి
లాభాలను దాచిదాచి
కోటికి పడగెత్తాలని
కల్తీలను చేసినారు
  కల్తీలను చేసినారు ...మోసం, మోసం, మోసం

ఆహారం దోచి దాచి
ధరలను పెంచేసినారు
కూలినాలి జేడు జనం
ఆకలితో చచ్చినారు
ఆకలితో చచ్చినారు ...దుర్మార్గం, దుర్మార్గం

త్రింశత్ సంవత్సరాలు
వింశతి సంవత్సరాలు
పులులై కసి మసగినారు
రక్తం పీల్చేసినారు
రక్తం పిల్చేసినారు పట్టుకోండి పట్టుకోండి
పట్టుకోండి పట్టుకోండి

హ్యాండ్సప్ హ్యాండ్సప్
ఎక్కడి దొంగలు అక్కడనే
గప్ చుప్ గప్ చుప్
ఎక్కడి దొంగలు అక్కడనే
ఎక్కడి దొంగలు అక్కడనే

చిక్కినారు చిక్కినారు
విద్రోహులు చిక్కినారు
ఇరుల దూరినట్టి దొరల
జైళ్ళలోన కుక్కినారు
జైళ్ళలోన కుక్కినారు ...భలే, భలే, భలే, భలే,

ఓహోహో ఎంతమార్పు
ఎంతమార్పు వింతమార్పు
నింగినంటినట్టి ధరలు
నేలకు దిగి వస్తున్నాయ్
దోచిన దాచిన సరుకులు
అందుబాటు కొస్తున్నాయ్

దొంగలు దొరలై పోయిరి
దొరలు మరల దొంగలయితె
కుక్కతోక వంకరైతె
పునరావృత మవుతుందది-
పునరావృతమవుతుందది - పునరావృతమవుతుందది



# సాటిలేని జనం మనం

ప్రతివాడూ స్వార్థపరుడు
ప్రతి వక్కడు లంచగొండి
ప్రతిచోటా ఒక స్మగ్లర్
ఇదీ నేటి మనసంఘం

సహకారం అంటే యిట
మమకారం అని అర్థం
ఒకడుగ దోచుటకు బదులు
పదిమందీ దోచుకొనుట.

జాయింటుగ వ్యాపారం
అంటే అర్థం ద్వంద్వం
ఒకని కన్నుగప్పి వకడు
మోసం చేయుట అర్థం

ప్రతివాడూ కులస్వార్థి
ప్రతివకడూ పరభాషా
పరజాతి ద్వేషశీలి
ఇది భారత జనశీలం

ఎదటి నోటి కూడు మనకు
దక్కే మంత్రం యేమిటి
ఆత్మవత్సర్వభూతాని
ఇదే నేటి ఆచరణం

పూరి గుడిసె ప్రక్క మేడ
పస్తుల ప్రక్కన విందులు
కల్పించిన ద్వంద్వ ప్రకృతి
ఇది భారత నాగరకత

నీవు వేరు నేను వేరు
వాడు అంటరాని వాడు
సర్వం ఖల్విదం బ్రహ్మ
మిది భారత జన సంస్కృతి

అన్నమేమి సున్నమేమి
అంతా బ్రహ్మ పదార్థం
అందుకె అన్నం తిందాం
ఇదే నేటి వేదాంతం

ఇంత గొప్ప జాతి మనం
ఇదీ నేటి మన సంఘం
నాటికి నేటికిని గూడ
సాటిలేని జనం మనం



# కుక్క కాటుకు ....

ఎన్నో కష్టాలు గుడిచి
ఎన్నో తావులను దూరి
తిరిగి తిరిగి కూర్చి కూర్చి
తేనెపట్టు పెట్టినాము

మా కన్నులలో ధూమం
సోకించి సుదూరములకు
తరిమికొట్టి చుట్టుముట్టి
దురాక్రమణ చేసినావు

వళ్లంతా కంబళిగా
భల్లూకా కారంతో
అహంభావ మదకరిలా
అయోమయపు హస్తంతో

కసి కలిసిన మక్కువతో
పసిగుడ్డులు గూడ చిదిమి
మధుకోసం చిదిమి చిదిమి
మధువంతా దోచినావు

పొంగ సోకగ కనులు మూసీ
తెగువతో పరాక్రమించి
పారిపోవుటకు మారుగ
దూరి, కుట్టి తరుమగలము
మధువును చేపట్టగలము

అనాదిగా సాగిన యీ
అన్యాయ్యం ఇక సాగదు
మా కష్టార్జితము కుడువ
మీకు హక్కు ఇంకెక్కడ

ఎన్నో కష్టాలు కుడిచి
ఎంతో కాలం శ్రమించి
అంతస్థులతో పుట్టల
నంతట నిర్మించినాము

మా పైనీ విషముగ్రక్కి
మాత్సర్యముతోన త్రొక్కి
శేషించిన వారు కాంది
శీకులుగా పోగా నీ

యబ్బసొత్తులాగ పుట్ట
నాక్రమించి కులికెదవా?
కన్నుమంచు బున్నుమంచు
కసినాల్కలు కోసెదవా?

పొంచి వుండి నీ రాకను
చూచి, చుట్టిముట్టి కనుల
దూరి, తోక, వీపు కుట్టి
పోరి నిన్ను చంపగలము
మా తావును పొందగలము

అనాదిగా సాగిన యీ
అన్యాయ్యం ఇక సాగదు
మా కష్టార్జితము కుడువ
మీకు హక్కు ఇంకెక్కడ?

గాలి, నీరు, ఆకాశం
ఇలా తలం, ఇంకా యీ
ప్రకృతి శక్తులంతా భూ
ప్రజల హక్కు జన్మహక్కు

స్వార్థ పూర్ణ బలవంతులు
ప్రకృతి ప్రజల హక్కుదోచి
దురాక్రమణ దారులుగా
మారినట్టి "పేర సైట్సు"

ఓ పరాన్న భుక్కులార
దోపిడీలు ఇక సాగవు
దురాక్రమణ సాగిస్తే
పోరాటం తప్పదింక

తోక తొక్కిన భుజంగము
లై కస్సుని లేచి రేగి
కాటువేసి కనులపీకి
కండల కాజేతురింక

ఈనిన పులులై క్రోధము
నీనుకంటి మంటలతో
కసిమసంగి కవోష్ణంపు
క్షతజం పానింతురింక

క్షుత్పీడిత ఘోణీ-సం
హతిక్రుద్ధమ్మై క్షోణిని
చలముపట్టి క్రమ్మిక్రుమ్మి
నట్లుగ చెండాడుదురిక

కనులు తెరచి మనసు మార్చి
మనగలరా బ్రతుకగలదు
లేదా ఇక దారి లేదు
గోదారే మీకిక గతి



# వాల్మీకి

వాల్మీకి కవిలోక
వనవాటి పికరాజు
రమణ కవితారకా
రాకాసుధాకరుడు

వాల్మీకి మహనీయ
పదగుంఫనపుఫణితి
రత్నహార స్థగిత
రమణీయమణిభాతి

వాల్మీకి మహనీయ
వర్ణనాత్మకఫణితి
ప్రకృతి సంపూర్ణతా
ప్రతియాతనా ఫణితి

వాల్మీకి మహనీయ
భావనా స్రోతస్సు
వారిదోత్పన్న-శం
పాలతాస్రోతస్సు

వాల్మీకి మహనీయ
శిల్ప కౌశల గరిమ
విశ్వసృట్ శిల్పసం
సృష్టికిని ప్రతి సృష్టి

వరభావతుందిలుడ
వేత్రైక కవిరాజ
ఓ కవీ వాల్మీకి
నీకివే జోహార్లు



# స్వర్ణయుగంలో మోసం

ఆదికవీ ఒక్కమాట
శూద్రుడవా, కాదునీవు
శోచనీయ బోయజాతి
తపస్వివై బ్రహ్మవైతి
తప్పా శంబూకుతపము?

నీ సృష్టించిన శబరిది
నీలాగే బోయజాతి
ఆమె తపోనిష్ఠ జూచి
రాముడాత్మ పొంగిపోయె

వాల్మీకీ నీ వారసు
లేల రామచంద్రునిచే
శంబుకముని చంపించిరి
జాతి భేదమును చాటిరి

వామాక్షుల హింసించిన
పాపమనును ప్రాబలుకులు
చిత్రహింస రామునిచే
చేయించిరిశూర్పణఖకు

ఒక్కసారిగా చంపక
ముక్కునటికి, చెవులునటికి
కాల్సేతులు నటికి తాట
కాఖ్యను చంపించినారు

సుగ్రీవాగ్రజుడు వాలి
సుగ్రీవుని భార్య రుమను
ఆక్రమించుట అధర్మమ
టంచు చాటె నీ రాముడు

కాని వాలి జంపినపుడు
వాని భార్య తారను, సు
గ్రీవు డాక్రమింప చిత్త
గించెనుగద నీ రాముడు

ఓ వాల్మీకీ యిదిగో
నీ వారసులైన కవులు
నీ వ్రాతకు విపరీతా
నే కార్థము లొలికించిరి

చరిత్రలో స్వర్ణయుగం
బంచని పేరెక్కినట్టి
గుప్తుల పాలనలో ప్ర
క్షిప్తం గావించినారు.

స్వార్థపూర్ణ పరభృతుల
స్వర్ణపూర్ణ అవకాశం
వర్ణధర్మ శస్త్రానికి
స్వర్ణయుగం గుప్తయుగం

అంటరానివారలపుడు
గంటగట్టి తిరుగవలసె
అందులకది స్వర్ణయుగం
అస్పృశ్యుల కర్మయుగం

జాతిచీలి చీలిచీలి
వ్యక్తి వ్యక్తి వేర్వేరై
అనైక్యముగ పరిణమించె
అందులకది స్వర్ణయుగం

ఆ అనైక్యతా ఫలముగ
అనేకులగు విదేశస్థు
లవలీలగనే మనలను
అణిచి ఆక్రమించినారు

నాటినుండి నేటివరక
నైక్యభావ సంతానం
కులతత్వం వేళ్లుదన్ని
కొనసాగుచున్నదిపుడు

వాల్మీకీ యీలోకపు
కల్మషమును జూచితివా
కోపఘూర్ణ హృదయుడవై
శపియింతువు యీ జాతిని.



# కలుపు మొక్కలు

కలుపు మొక్కలు, సస్య
బలహరులు, బదనిక ప
రాన్నభుక్, పిడుదులు ప
రాన్న భుక్కీటములు

రాజాధిరాజ రా
రాజ పరమేశ్వరులు
మంత్రి సత్తములు సా
మంత రాజోత్తములు

పాళెగాళ్ళులు, పారు
పత్తెదారులు గ్రామ
పెత్తెనపు దొరలు పర
పీడకులు, బదనికలు

వెట్టిచాకిరి కోట
కట్టుకొని అజ్ఞాన
ప్రజల కష్టఫలాన్ని
ప్రమదమున కుడుచుచును

మదిరాక్షి ఒకచేత
మదిర వేరొక చేత
అధరాసవము కోస
మ్రరు చాచుట తోడ

దశదిశల యౌవతము
దిస మొలలతోనాడ
సర్వాంగ దర్శనో
త్సవ పూర్ణ హృదితోడ

వయసు చెల్లిన గూడ
వగరు చూపుల తోడ
కసి కలిసినట్టి ర
క్కసి కాముకత తోడ

జీవితము సర్వస్వ
మీ విధముగా మజా
గా నడుపుకొనిరిగ ప
రాన్న భుక్కులు నాడు

ఈనాడు మన నాట
ఏ నాట గూడ ని
న్నటి దాక అట్టి క
న్నడి ఆట సాగింది

ప్రజ కన్ను తెరిచింది
ప్రజల కోసము ప్రజా
స్వామ్య ప్రభుత్వ సం
స్థాపనము జరిగింది



అయిన నేమాయెలే!

కుక్కతోక మనస్సు
చక్కగా సాగునా?
సాగినా నిల్వదది
చుట్టుకొని పోవునది

అభినవ మహారాజు
లంతటా వెలిశారు
ప్రజల కష్టము దోచి
ప్రభువులై పోయారు



కోటీశ్వరుల, పెద్ద
కంట్రాక్టరుల, దొంగ
వ్యాపార్ల, పెద్దభూ
స్వాముల, జమీందార్ల
సుఖములకు మితి యేద?

సురలోక పతి యొక్క
సుఖము కన్నను మిన్న
నేటి భోగాలలో
నాటి భోగాలెంత?

ఇష్ట భోగుల కైపు
కష్టజీవుల బాధ
ఆకాశ పాతాళ
అంతరము పొందింది.

ఇటుచూడు అటుచూడు
ఎటుచూడు అటువైపు
పరపిండ భోజన దు
రాక్రమణ పీడకులు

ఇటుచూడు అటుచూడు
ఎటుచూడు అచ్చో ప
రాన్న భుగ్గో ముఖ
వ్యాఘ్ర దుర్మార్గములు

ప్రజ కన్ను తెరిచింది
ప్రభుత కను విప్పింది.
అత్యవసరాత్యయిక
స్థితిని ప్రకటించింది

దొంగ వ్యాపారులను
జైళ్లలో క్రుక్కినది
పర పీడకుల బట్టి
చెరసాల క్రుక్కినది

ఆస్తి పరిమితము, భూ
స్థితికి పరిమితము, ఆ
దాయ పరిమితము, సం
తాన పరిమితములకు

కట్టుదిట్టమ్ముగా
చట్టాలు చేసినది
అమలు కోసము లంచ
గొండ్ల తొలగించినది

కుక్కతోక మనస్సు
చక్కగా సాగునా
సాగినా నిల్వాదది
చుట్టుకొని పోవునది

భూమి గుండ్రము, చరి
త్రము పునరావృతము

ప్రతి రుతువు కలుపు ఉ
త్పాటనము సహజమ్ము
సమభోగ సమ సమా
జము నాడు సహజమ్ము

కలుపు మొక్కలుసస్య
బలహరులు బదనిక ప
రాన్నభుక్, పిడుదులు ప
రాన్నభుక్కీటములు.

—o—

# సెప్టిక్

ఎందుకింత సంతానం
ఎందుకిట్టి సంతానం
అమ్మా భారత నారీ
ఆపవమ్మ ఉత్పత్తిని

తథాగతుడు ఒక్క సుతుడు
గాంధీజీ మరియొక్కడు
వారిని మినహాయిస్తే
ఏరి నీకు మంచి సుతులు

అంతేనా నీకు సుతులు?
ఎంతో మందిని కంటివి
అందరూ కులస్వార్థులు
ఘోర దురాక్రమణ పరులు

ఎన్నడైన నీ సంతతి
ఏకతతో బ్రదికినదా?
ఎన్నడైన నీ సంతతి
సమతతోడ బ్రదికినదా?

నేటికినీ నీ సంతతీ
నీతులు వల్లిస్తున్నది
నేటికినీ నీసంతతి
బూటకముగ మనుచున్నది

ఇదిగో నీ యందు తప్ప
ఎందైనాసుతులందున
సమైక్యమ్ము, పోనీలే,
సమతలేని స్థితి గలదా?

ఇదిగో, నీయందు తప్ప
ఎందైనా సుతులందున
సమత్వమ్ము-పోనీలే
అస్పృశ్యత కనబడెనా!

ఇదిగో నీ యందు తప్ప
ఎందైనా సుతులందున
అస్పృశ్యత-పోనీలే-
అన్నానికి కొరవడెనా

సమైక్యమ్ము, సమత్వమ్ము
సత్యాహింసాయుతమ్ము
అస్పృశ్యత లేని తనము
కలిగినదే జాతిసుమ్ము

స్మృతుల ద్రోహ బోధవల్ల
సెప్టిక్ అయిపోయె జాతి
కావున భారత నారీ
కనకు, కనకు, ఇక సంతతి

ముగ్గురు వల దిర్వురు వల
చొక్కరుగూడా వద్దిక
ఈ సృష్టి తరించినాక
పునస్సృష్టికై కడగుము



# వర్గాంతం

ఇది క్రోధం కాదు సఖా
దౌర్జన్యం అసలు కాదు
మదిరేగిన తీవ్ర తీవ్ర
ప్రతీకార వాంఛ సఖా
ఇది అమర్ష కాదు సఖా

స్వార్థపూర్ణ బలవంతులు
ధరాధిపులు తన్మంత్రులు
అనాదిగా సాగించిన
అన్యాయ్యము లెన్ని యెన్ని?

వర్ణ దౌష్ట్య కారణముగ
దీర్ణమైన నరసంఘం
ఎడపెడగా చీలి చీలి
ఎన్నో కులములుగ మారె.

వీడు వేరు నేనువేరు
వాడు అంటరాని వాడు
అంతా ఒకటన్న జాతి
భావం మృగ్యం అయినది

గ్రామాలకు అవల దోలి
భూమిబుట్రహక్కులాగి
నిరంతరం కూలీలుగ
మార్చివేయ బద్ధవారు

ఈ రహస్య మెరిగి నేటి
హరిజనులతి కోపదగ్ధ
చిత్తులై ప్రతీకారం
చేయబూన తప్పౌనా?

అత్యాశా ప్రేరితులై
నిత్యావసరాహారము
దాచి ధరల పెంచువారి
దండించుట తప్పౌనా?

ఆరోగ్యం కోసమైన
ఔషధాలలో గూడా
కల్తీచేసెడి కటికల
కారించుట తప్పౌనా?

కానిగూడ ఆదాయం
లేనివారు కోట్లు కోట్లు
నిర్దిష్టాదాయంగల
ఉద్యోగులు వేన వేలు

పాపం యీ పుణ్యజనుల
నాశ్రయించు జనులనుండి
లంచాలను గుంజువారి
పీచమడచ తప్పౌనా

అవకాశం చిక్కించుకు
లైసెన్సులు కాంట్రాక్టులు
పర్మిట్టులు ఫ్యాక్టరీలు
ఉద్యోగపు సెలెక్షన్లు

అన్నీ తమకులంవారి
కే నైవేద్యం పెట్టే
దాక్షిణ్యం లేనివారి
దండిస్తే తప్పౌనా

స్త్రీకి బుట్టి స్త్రీలబెరిగి
స్త్రీని కళత్రముగ గలిగి
బానిసగా హింసిస్తే
శిక్షించుట తప్పౌనా

ఈ స్వార్థపు దుర్మార్గం
మర్యాదగ మార్తుందా
మంత్రాలకు ఎందయినా
చింతకాయ రాల్తుందా ?

చెరుకా బెల్లము నిమ్మం
చెంతడిగిన ఫలముందా?
గానుగలోనలి చాకన
గౌరవముగ నిచ్చుగాని

స్వార్ధమనే వృక్షానికి
కులతత్వం తల్లివేరు
స్వార్ధం చావాలంటే
కుల నిర్మూలనము మందు

స్వార్ధరూప వృక్షానికి
వర్గ సృష్టి పిల్లవేళ్ళు
ధనదృష్టికి ప్రాధాన్యం
తప్పిస్తే వర్గాంతం



# ఉల్టా-సీదా

స్వార్థ పరత్వం చంపుకొంటకై
త్యాగాల్ చేసిరి ఆనాడూ
త్యాగ ఫలితమని ప్రజలదోచుకొని
తినసాగిరయా యీనాడూ

వర్ణవిభేదం వర్గవిభేదం
పోవాలన్నారానాడూ
అవే నేటి తమ ఆరాధ్యములుగ
ఆరాధిస్తారీనాడూ

అజ్ఞాన వినాశమునకు విద్యే
ముఖ్యమనిరయా ఆనాడూ
అది వస్తే మరి సమత్వమొస్తే
యేలేదెవరంటారీనాడూ

చిన్న కులస్థులు బీదలు సాదలు
ఉద్ధరింపబడవలెనన్నారూ
అదే జరిగితే తమకు సేవకులు
యెవరంటారయ యీనాడూ

సత్యం ధర్మం న్యాయ్యం ప్రేమం
దైవం ఒకటే అన్నారూ
నిత్యం దైనందిన కృత్యాల్లో (కార్యాల్లో)
ఒకటీ కనబడదీనాడూ

మాటలు చేతలు చిత్తశుద్ధి ము
ప్పేటగ ముప్పిరి గొనాలయా
అపుడే నిజముగ సామ్యవాద సం
స్థాపన జరుగుట తథ్యమయా
మాటలు చేతలు...



# ఇంతే కాబోలింతే లోకం

ఉంది వాళ్లకు
తింటారు దండిగ
లేదు మాకు
తినటానికే లేదు.

మలబద్ధకం బాధిస్తుంది వాళ్లను
మలమల మాడి చస్తాం మేము

ఉంది వాళ్లకు
కడతారు దర్జాగా
లేదు మాకు
కట్టడానికే లేదు
కాళ్లకింద రోడ్లమీద
పూడుస్తాయి వారి దుస్తులు
కటినైనా కాస్త పూర్తిగా
కప్పలేవు మా దుస్తులు

కాలుదించి కిందపెట్టరు వారు
కార్లలోనే తిరుగుతారు
కాలినడకతప్ప గతిలేదు మాకు
కాళ్ళుగూడా నిరాకరిస్తాయి చాలాసార్లు

అధికారంతో మాట్లాడతారు వారు
గర్వపటిమతో శాసిస్తారు వారు
వారిగొంతు విహాయసంలో వుఱుముతుంది

నమ్రతతో మాట్లాడాలి మేము
వినయంతో విన్నవించాలి మేము
మా గొంతుక పైకే లేవదు
ఎదటి చెవికి గూడా సోకదు

వున్నవారూ లేనివారూ
వద్దంటున్నా పెడతారు వారికి
మే మమ్మా ఆకలి అంటున్నాగూడా
చూచీచూడనట్లుగా పోతారు

వారు నవ్వితే నవ్వే నటిస్తూ
కోతలు కోస్తే మెప్పు నటిస్తూ
అన్నిటికీ తాళమును భజిస్తూ
తలవూపుతుంది లోకం అంతా

మా నవ్వుల పరిహసిస్తూ
మా దుఃఖాన్ని అనాదరిస్తూ
ప్రతిదానికీ విసుగు వహిస్తూ
చీదరించుకుంటుందీ లోకం

ఏదో పొరపాటున
మాలో కొందరు
అట్లా మార్తే
వారికిగూడా అదే సన్మానం

కర్మంకాలి
వాళ్లలో కొందరు
ఇట్లా మార్తే
వారికిగూడా మాదే కర్మం

నవ్వొస్తుంది
ఇదంతా చూస్తే
ఇంతే కాబోలింతే లోకం.



# ఉషస్స్వప్నం

పురుషుడు ఒక ఆడుదాని
పరిణయమాడుట సహజము
అనుకొని ఒక అమాయకుడు
హరిజనుడు సవర్ణబాలి
కా లలామ నొక్కరితను
ప్రేమజూపి ప్రేమను గొని
పరిణయమాడగదలచెను

అదితెలిసి సవర్ణులంద
రగ్గికక్కి చెట్టుగట్టి
క్రమ్మికుమ్మి బాదినారు
సొమ్మసిల్లిపోయినాడు

చైతన్యం తప్పి కనులు
మూతలు పడినప్పటికీ
రోషానలదాహంతో
ఘోషించెను తన అహంత

ఏమిటి యీ దౌర్జన్యం
ఏమిటి యీ అజ్ఞానం
పురుషులలో యీ భేదం
కారణమా కులతత్వం ?

సోమరులను సృష్టించిన
సుక్రతువీ కులతత్వం
శ్రమగౌరవ నిష్కాసన
జిహ్మం యీ కులతత్వం

జాతిని ముక్కలు ముక్కలు
గా తరిగిన పరశ్వధం
అస్పృశ్యత సీనినట్టి
అమానుషము కులతత్వం

ఓ సవర్ణులార మేము
ఓపికతో ఆగినాము
మనసొప్పదె సమభావం
మర్యాదగ పాటింపగ

చెరుకా బెల్లము నిమ్మం
చెంతడిగిన యిస్తుందా ?
గానుగలో నలిచాక స
గౌరవముగ సమర్పించు

అసంతుష్ట హరిజన్ములు
అంతర్ జ్వాలతాంగులుగా
దుష్టోరగ సందష్టో
త్తిష్ఠులగుచు కసిమసంగి
పిసపిసరుగ తొక్కితొక్కి
ఉసురుగొనక తప్పదింక

ఓ పరాన్నభుక్కులార
ఓ సవర్ణులార మీరు
సగౌరవముగా భాగం
సమానముగ పంచండి
పంచారా బ్రదుకు గలదు
లేదా యిక దారిలేదు
గోదారే మీకిక గతి.



# కొత్తసిగ్గు

కనులార చూడంగ
మనసు కలుగునుగాని
మనసు తిరిగినవైపు
కనులు తిరుగగలేవు

ముదమార మాటాడ
మది దలంచును గాని
హృదయకంపముచేత
పదము బయటికి రాదు

పదముచ్చరింపంగ
పదపడి ప్రయత్నించు
వదనగహ్వరమందు
పదను చెడి పోడియౌను

కూర్చుండి యేమేమొ
చర్చింప మది దలచు
చర్చ విషయమురాదు
కూర్చొనగ లేదేలొ

పొరంగ నుంకించు
పొరపదములురావు
చేరి చెంతనె యుండ
గోరు నుండగలేదు

తన ప్రియుడు కనుచున్న
తన యంగముల నెల్ల
కానబడకుండంగ
కనుకనించునుగాని

ఆ యంగములనెల్ల
ప్రేయసుడు చూడంగ
సాయపడునేగాని
మూయలేదెందుకో.



# ఆడవాళ్ల మీటింగు

ఒకనాడు జరిగినది
ఒకచోట మీటింగు
ఆనాడుపన్యాస
కుడు సంఘసంస్కర్త
అధ్యక్షుహర్యక్షు
డొక మహాకవిగారు
బహుమతులనిచ్చుటకు
ఒక ఆడ ఉద్యోగి

ఆసీనులయ్యాక
అధ్యక్షుడన్నాడు

సోదరీమణులార
ఈనాడు పర్వదిన
మీనాడుపన్యాస
కులు గొప్పసంస్కర్త

అనగానె సభలోన
అమరేశ్వరిట్లనెను.

ఓ నా సరోజినీ
హైదరాబాదులో
చౌకటే ముత్యాలు
నాకు తెప్పిస్తావ

ఇంతలో సంస్కర్త
లేచి యిట్లన్నాడు

సోదరీమణులార
చిన్న విన్నపమండి
మధ్యమధ్యన మీరు
మాట్లాడవద్దండి
నేటి నా సబ్జక్టు
నాటి స్త్రీ నేటి స్త్రీ

మణిఅమ్మ ఇంతలో
మరియమ్మ కిట్లనియె

నాటి స్త్రీ యేముంది
వట్టి బానిస గొడ్డు
గంత కట్టినయట్టి
గానుగెద్దుల బ్రదుకు

చూడండి చూడండి
సోదరీమణులార
నాటి స్త్రీ గృహమునకు
నాయకీ పీఠమ్ము

అంటె జ్ఞాపకమొచ్చె
కంటివా సుగుణమణి
పొరుగింటి పుణ్యవతి
భర్త శ్రీపతి ఆమె
మాట జవదాటునా
దాటి జీవించునా ?
ఆహ నారీమణియె
గృహమునకు యజమాని

ఓ సోదరీమణులు
ఒకనాడు నారీ-మ
ణీ ఖడ్గ నిస్త్రహ
ణోద్భూత ప్రత్యర్థి
హాహారవమ్ము చే
హరిదంత భూనభో౦
తర సర్వభాగమ్ము
నిబిడీకృతమ్ముగా
నిండి నినదించినది

అన్నట్టు మరిచాను
విన్నావె సుందరీ
యన్.సి.సి. చేరి మా
యమ్మాయి దుర్గమ్మ
రైఫిలు ప్రయోగించి
బెలగువ్వ కొట్టినది.

సోదరీ మణులార
సైలెన్సు సైలెన్సు
అలనాడు వనితా, మ
ణిలోక మశ్వాది
వాహనాధిష్ఠయై
విహరణము చేసినది.

అబ్బబ్బ యేమంత
గొప్పయినాడు మన
కార్ణకంటెను గొప్పె
గజములూ గుఱ్ఱములు

సొదరీమణులార
సైలెన్సు సైలెన్సు

ఆనాడు భారతా
వని నిండబంగారు
ధనధాన్య పూర్ణమై
ఘనత వహియించినది.

ఏమివోయ్ కోమలీ
బంగారము ధరెంత?
మెడలోని నెక్లీసు
యేడ చేయిస్తివి?

సర్లేవె మల్లికా
మెల్లగా మాట్లాడు
ఆ ఉపన్యాసకుడు
ఉరిమి చూస్తున్నాడు

చూడనీ అదియేమి
చోద్యమే, తప్పేమె!
మనమిక్కడన్నాను
మాట్లాడుకో వద్ద

సోదరీ మణులార
మాట్లాడబోకండి
ఇంక మాట్లాడిరా
సన్యసించేస్తాను.

బ్రదికించితివి బాబు
బెదిరిస్తవా యేమి
చాలించు చాలించు
సన్యసిస్తే మేలు

కనకసుందరి నీవు
క్లబ్బుకే రావేమె
మొన్న పేకాటలో
మీనాక్షి పైచేయి

శంపాలతా యిదో
రేపు, రెడీగావుండు
మావార్ని ఆఫీసు
లో విడిచి జీపులో
మీయింటి కొస్తాను
షాపింగు వెడదాము

చూడవే సత్యా క
ళాశాలలో మొన్న
ఫోజుకొట్టిన పెద్ద (దొడ్డ)
వాజమ్మ యెవ్వడే?

నాక్లాసుమేటు అ
న్నిట సున్న పిచ్చాడు
వేషాలపై మోజు
అందుకే ఆపోజు

అమ్మలారా మీరు
ఆపండి అపండి
ఒక మంచివిషయాన్ని
చెప్పి చాలిస్తాను.

యేమి బాలామణీ
యేమిటే యీజిడ్డు
ఆపుతానంటాడు
వదిలిపెట్టడు చూడు
(ఆపదేమే పీడు)

ఆ అరవ సినిమాలో
ఆ హీరో చూశావ
చాల బాగున్నాడు
ఛాఛా హీరోయిను

ఏటి మాటే అది
ఎంత బాగుంది డ్రెస్
ఆప్యాంటు ఫిట్టుగా
నప్పింది దానికి

ఓ సోదరీమణులు
ఏమిటా రొదరొదలు
మీలోని ప్రతివారు
పన్యాస శేఖరులు

ఒక్కొక్కరే మీరు
ఎక్కి వేదికపైన
గుక్కతిప్పక నగలు
నాణ్యాలు సినిమాలు

నాట్యాలపై ఝోరు
గా ఉపన్యాసాలు
దంచివేతురు గాని
రండి వేదికపైకి
రండి వేదికపైకి

సంధ్యవేళల యందు
ఈతతోపుల యందు
పక్షిగమి రొదరొదలు
స్త్రీమండ లీరొదలు



# అనుసరణీయం

తేనెటీగ తొండములో
తేనె యెంత పట్టగలదు
కాని అదే కూడి కూడి
తేనె పెరగమారునుగద!

చీమ తొండమెంతకద్దు?
వామలూరుతో పోల్చిన
కానీ రేణువులు కలియ
గా, పుట్టగ మారును గద!

నీటి బిందువెక్కడ-ము
నీటి జలముతో పోల్చిన
ఆబిందువులే ప్రోగై
అర్ణవముగ మారునుగద

క్షణమనగా ఎంతకద్దు
క్షణం క్షణం కూడికూడి
అనంతమౌ కాలముగా
అచ్చెరువుగ మారునుగద

ఈ చీమా, ఈ బిందువు
ఈ భ్రమరం, యీకాలం
మనకంతా ఆదర్శం
అనుసరణీ యా దర్శం

వర్షాకాలం నీటిని
బ్రహ్మజెముడు పీల్చి ఆకు
లందుదాచి ఎండా కా
లం వాడును పొదుపరిగా

ప్రాణినుండి జలగపీల్చు
శోణితమప్పటికేనా
ఆహారం దొరకనట్టి
ఆరునెలలకై పొదుపది

వింతజంతువౌ ఉష్ట్రం
ఎంతో జలమును గ్రోలును
అప్పటికే కాదుకాదు
ఎప్పటికో దాచుకొనుకు

ఈలాగా బ్రహ్మజెముడు
ఈ జలగా ఈ ఉష్ట్రం
అన్నీ మన కాదర్శం
అనుసరణీయాదర్శం

అధికులు జంతువులకంటె
బుద్ధిజీవులగు మనుజులు
అధికాంశం అలాగైన
పొదుపుగ జీవింపవలయు.



ప్రభుతలలోకెల్ల ప్రజా
స్వామ్య సామ్యవాద ప్రభుత
వరణీయం; మన భారత
ప్రజా ప్రభుత మన భాగ్యం

ప్రణాళికల ప్రయోజనం
ప్రజలయొక్క అభ్యుదయం
సంక్షేమం కాంక్షించే
ప్రభుతయొక్క అభిగమనం

భారత భాగ్యవిధాతలు
ప్రాచీనులు, మననేతలు,
ప్రజాభ్యుదయ కాముకులై
ప్రణాళికల రచియించిరి

క్షుద్బాధా నివారణకు
అధికాన్నోత్పత్తికొఱకు
ఇరిగేషన్ ప్రాజెక్టులు
విరివిగ నిర్మించినారు

వస్త్రోత్పత్తికి మిల్లులు
బహుధా నిర్మించినారు
గృహ నిర్మాణములనెన్నొ
ఘనముగ సాగించినారు

ఎరువుల కర్మాగారా
లెన్నో నిర్మించినారు
రవాణాల ప్రయాణాల
సాధనాల కూర్చినారు

విద్యా వ్యాప్తికి విద్యా
లయాల నెలకొల్పినారు
ఉన్నవాళ్ళ పొట్టకొలుకు
పుట్టుక లరికట్టినారు

ప్రణాళికల సాయంతో
దారిద్ర్యం రూపుమాప
సమకట్టిన ప్రజా ప్రభుత
తెచ్చి ఖర్చుచేసె కోట్లు

కాని బీద వర్గాలకు
కాని గూడ దక్కలేదు
మోసగాళ్లు మొనగాళ్లై
మూటలు కట్టేసినారు

నిస్వార్థపు నాయకమణు
లీ స్వారాజ్యం తేగా
స్వార్థపు నాయకులు శల్య
సారథ్యం చేసినారు

అడుగున బడినట్టి ప్రజను
అణగారిన యట్టి ప్రజను
అందల మెక్కిస్తామని
అంధువులో త్రోసినారు

చేసిన బాసలను మరిచి
మోసాలను చేసినారు
ఏరుదాటి తెప్పను తగ
లేసినారు బలిసినారు

ఉన్నవాడు అంతకంత
ఉన్నతుడై పెరిగినాడు
లేనివాడు అంతకంత
ఎరసించి పోయినాడు

ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్ర
మిదం శాంతమనెడి నీతి
ప్రత్యక్షర ప్రస్ఫుటముగ
ప్రకటించిన జాతి మనది

ఈ జాతే దండెత్తిన
దుర్జాతుల చేత జిక్కి
చావుదప్పి కన్ను లొట్ట
బడినట్లుగ పంగైనది

సర్వం ఖల్విదం బ్రహ్మ
మానందో బ్రహ్మ మహం
బ్రహ్మోస్మి; త్వమేవాహ
మని చాటిన జాతి మనది

ఈ జాతే అహంకార
దుర్జాతిగ మారి, చీలి,
పరులనుండి సామ్యవాద
మెరవు తెచ్చుకొంటున్నది

అన్నం బ్రహ్మ స్వరూప
మన్నం బహుకుర్వీతని
అక్షరాల పాటించిన
అక్షయమగు జాతి మనది

ఈ జాతే అన్నానికి
అలో రామచంద్రాయని
పాశ్చాత్యుల వెంట నంటి
బ్రతిమలాడు కొంటున్నది

ఆనాడూ యీనాడూ
ఏనాడూ భారతీయు
డేమి ధర్మములు పలికెనొ
తద్విరుద్ధ మాచరణము

అస్పృశ్యత అంతరించిత
మయ్యిందా నిజం చెప్పు
హరిజనుడీ సంఘానికి
అరి అయితే కాదు తప్పు

దళితవర్గ మభ్యుదయం
పొందిందా నిజం చెప్పు
అసంతృప్తి పొంది వారు
అగ్గయితేకాదు తప్పు

మోసం, స్వార్థం, పాపం,
పోయాయా నిజం చెప్పు
తత్కారక ఘాతకులను
దమియిస్తే కాదుతప్పు

చెడుగును తప్పించి మంచి
నడతవలన పొందు మెప్పు
ప్రజా ప్రభుతపై ధోరణి
వహియిస్తే తప్పు ముప్పు

# ఆంధ్రాత్మహత్య

ఒకజాతికి ఒక్క-భాష
ఒకేభాష మన జాతిది
ఇందులోనె అంతరాలు
ఆంధ్రజాతి తలపనగునె
ఏస వేరుకావచ్చును
బాస వేరుకాదుగదా
తనువులు వేరగునుగాక
తల్లి కంద రొకటేగద !

ఏదో స్వార్థంకోసం
వాదులాడి గ్రుద్దులాడి
తలలు కోసికొనదగునా
తెలుగుతల్లి బిడ్డలార.

జ్ఞాతి మత్సరము మానవ
జాతికి సాజమ్ముగాని
హద్దుమీరి మానవతనె
హత్యజేయ తలపనగునె ?

తెంపుచేసి పోనిమ్మని
తెలుగుభూమి చీలిస్తే
ప్రత్యేకం సౌకర్యం
ప్రతివానికి దక్కుతుంద !

కులము బలము గలవారలు
కొట్టేస్తా రంతేగద !
అక్కడైన ఇక్కడైన
ఎక్కడైన అంతేగద !!

మనకు భూము లెందుకండి ?
మన భాగ్యం పెంచుకొఱకు
మన చదువులు ఎందుకండి
మన కుద్యోగమ్ము కొఱకు

ఈ స్వార్థం అందరికీ
పరమార్థం అని తెలియద ?

ఆంధ్రులార యెందుకు మరి
ఆంధ్రులపై యేవగింపు
అసహనమ్ము పెంచవలదు
అదే మనకు ఆత్మహత్య

—o—

# పరిష్కారం

భరతభూమి పవిత్రోర్వ
రారత్నఫలం మహాంధ్ర
ధన్యభూమి భారతోర్వి
ధాన్యాగారం మహాంధ్ర

కృష్ణా గోదావరీ-క
వోష్ణజలం త్రాగిత్రాగి
తుంగభద్ర జలముల మా
ధుర్యమ్మును క్రోలిక్రోలి
పెన్నానది సారమైన
పన్నీటిని పీల్చిపీల్చి
రాజభోగ సుమధురమౌ
రాజనాల పండిపండి

మా ఆంధ్రప్రదేశమ్ము
మాన్యత్వము పొంది సాటి
రాష్ట్రాలందున మేటిగ
రాజించెను శోభించెను

పరిపాలకు లెన్నెన్నో
పరిశ్రమల స్థాపించిరి
విశేషముగ గ్రామాలకు
విద్యుత్తును ప్రాకించిరి
అజ్ఞాన ధ్వంసక వి
ద్యాలయముల స్థాపించిరి
కోకొల్లలుగా ద్రవ్యం
కోట్లకొలది వెచ్చించిరి

కానీ, జరిగినదేమిటి ?

కలిగినవా డంతకంత
బలిసి త్రివిక్రముడాయెను
లేనివాడు అంతకంత
హీనస్థితి హ్రస్వుడాయె

పరిపాలక కులములకే
సర్వీసులతో లాభం
పరిపాలక కులములకే
పర్మిట్లకు ప్రాధాన్యం
పరిపాలక కులములకే
బస్సురూట్ల పరిదానం
పరిపాలక కులములకే
ప్రత్యకం కాంట్రాక్టులు

సామాన్య ప్రజానీక
సంక్షేమం కోసంగా
పొందించిన ప్రణాళికలు
స్వార్థుల ప్రాప్తం కాగా

ప్రచారాల ఫలితంగా
ప్రజలు తేజమును పొంది
ప్రశ్నింప సాగినారు
ప్రజాప్రభుత్వమును నేడు

ప్రాజక్టులు కట్టినాము
పంటలు పండించినాము
ఏ కలియో గాని మాకు
ఆకలిగానే వుందని

రమ్యమైన హర్మ్యాలను
నిర్మాణము చేసినాము
ఏ గ్రహచారమ్మో గాని
ఈ గుడిసెలె మా గతియని

మిల్లులెన్నో కట్టినాము
బట్టలెన్నో నేసినాము
ఏ పాపమొ గాని మాకు
ఈ పీలికలే గతియని

నిర్వేదం పొందినారు
ఆక్రోశం చేసినారు
ప్రతీకార మెట్లాగని
ప్రతీక్షింప సాగినారు

నిర్వేదం ఆక్రోశం
రాజ్యేందిర కనులుతెరిచె
వెన్వెంటనె పాలకు ల
న్వేషించిరి మార్గాలను

బ్యాంకుల జాతీయం భూ
సంస్కరణలు అమలు జరిపి
ప్రీవీపర్సు తొలగించెను (చిరి)
ప్రివిలేజస్ తొలగించెను (చిరి)



# నిజం నిజం

నిజం నిజం నిజం నిజం
రేపటికైనా భారత
జాతి ఏకమౌట నిజం ...నిజం నిజం

గతంలోన దుస్స్వార్థం
జాతిని చీల్చింది నిజం
చీలి చీలినట్టి జాతి
నిర్వీర్యమయింది నిజం ...నిజం నిజం

దశాబ్దాల శతాబ్దాల
తరబడిగా కులం జులుం
సాగి వెట్టి చాకిరి తర
తరాలుగా సాగె నిజం ...నిజం నిజం

వారసత్వ పద్ధతి పరి
పాలన పోయింది నిజం
ప్రజల బానిసలుగ జూచు
ప్రభుత తిరిగి రాదు నిజం ...నిజం నిజం

పరుల కష్టఫలం జన్మ
హక్కుగ భుజియించు జనం
తమ ఆటలు ఇక సాగవ
టంచు తెలిసికొనుట నిజం ...నిజం నిజం

నిజం నిజం నిజం నిజం
నేటికైన యీ మానవ
జాతి మేలుకొనెను నిజం
నిజం నిజం నిజం నిజం ...నిజం నిజం

మేలుకొన్న జాతి ప్రతీ
కార చిత్తులవుట నిజం
ప్రతీకారమునకు ప్రతీ
కారమె ప్రతిఫలం నిజం ...నిజం నిజం

ఉష్ణం ఉష్ణేన శీత
లం అన్నది నిజం నిజం
పొంగిన జలమొలికి మంట
చల్లబడుట నిజం నిజం ...చిజం నిజం



# సంజీవదామోదరం

పదవులు తమతమయంతట
వరియిస్తేనే ప్రాగ్యాం
ఆ అదృష్టమెవ్వరికో
నూటికి కోటికి ఒకడికి

ఏమి అదృష్టమ్మోగాని
దామోదర సంజీవయ
త్రిదశ స్థితి గలదొ యేమొ
త్రి దశుడుగా మంత్రియయ్యె

నలువదేండ్లు నిండకుంత
నాల్గుకోట్ల ఆంధ్రప్రజకు
ముఖ్యనాయకాగ్రణియై
ముఖ్యమంత్రి కాగలిగెను.

నలువదొకటి నిండగనే
నలువదొక్క కోటి ప్రజకు
నాయకుడై భారతీయ
కాంగ్రెసు అధ్యక్షుడాయె

అర్ధశతం నిండకుండ
అనేకమ్ములగు పదవుల
నాక్రమించి అఖిల జనుల
ఆమోదము నొందగలిగె

ఏమిటీ యీ విపరీతము!

పుణ్యుడల్ప జీవియంట
పాపాత్ముడు చిరాయువట
చిరాయువుల వదలి మిత్తి
పుణ్యాత్ముని గొంపోయెను

ఘోరవార్త సంజీవుని
మరణవార్త దుఃఖవార్త
అత్యున్నతి పరాకాష్ఠ
నందువేళ పతనవార్త

మధ్యందిన మార్తాండుడు
మధ్యలోనె క్రుంకినట్లు
నిండుబండి వంతెనపై
నుండి యేటదొర్లినట్లు
అమరుల దగుకనకపుటిక
రాహుకబళమైన యట్లు
క్షుధార్తార్థక్షీరాన్నము
క్షోణిపతనమైనయట్లు
అత్యున్నత స్థితిబొందుచు
మృత్యువాత పడిపోయెను.

# గ్రంథాలయం

పుస్తక భాండాగారము
నిస్తుల ధనభాండారము
భిన్నరుచుల వారెల్లర
భిన్నత్వము పొందు స్థలం

గ్రంథాలయము సరస్వతి
మందిరమతి సుందరమది
అది సరస్వతీ పుత్రీ
సుందరీమణీ సదనము

ఒక కుమారిక కవిత్వం
ఒక్క కుమారిక శిల్పం
ఒక పుత్రిక సంగీతం
ఒక పుత్రిక నయశాస్త్రం

ఒకతుక భౌతికశాస్త్రం
ఒకతె రసాయనశాస్త్రం
ఒక పుత్రిక వేదాంతం
ఒక పుత్రిక చార్వాకం

ఒక పుత్రి భరతశాస్త్రం
ఒక పుత్రిక రతిశాస్త్రం

గ్రంథాలయ మత్తగారి
గృహం మీరుజామాతలు
కవులు, గాయకులు, శిల్పులు
కళావేత్తలరు మీరలు

చతుష్షష్టి కళలకు ఇది
సద్మం, మీశ్వశుర గృహం
ఎవరికి నచ్చిన విధాన
ఎంతైనా సేవింపుడు

కళలయందు చోరకళయు
క్షౌరకళయుగూడ గలవు
గ్రంథ చౌర్యమున బోకుడు
క్షౌరము జోలికి బోకుడు



# నిండిన కడుపుల నిరాహారదీక్ష

నిండిన కడుపులవారు
నిరాహారదీక్ష సాగిస్తున్నారు
అల్లంత దూరంలో ఎండినకడుపు బిచ్చగత్తె
ఎదురుగా శోషతో కూర్చుంది
అందరూ చూస్తుండగా సత్యాగ్రహులు
అన్నాదులు తినగూడదు
అందుకు పానీయాల సప్లయిలు
అనుక్షణం సాగుతున్నాయి శిబిరంలో
ఎంతతిని కూర్చున్నారో ఉదయం
ఎవరి మొగమూ వాడను గూడాలేదు.
ఎప్పటినుండో భిక్షుకి ఇటు చూస్తూనేవుంది.
వీరి గుటకలు అనుసరించి
గుటకలు మింగుతూనేవుంది,
మింగి మింగి మింగలేక పడిపోయింది
మబ్బుపడ్డాక ఎప్పుడో చందమామ
మంచునీళ్లు చల్లాడు గాబోలు
తెల్లవారి సత్యాగ్రహులు ఆకలితో లేచేటప్పటికి
తెలియదు ఏమయిందో!



# "నీకు తావులేదు"

అంతరిక్షము నుండి
అవనీతలమ్ము పై
అవతరింపగ దలచి
అరుదెంచు జీవాత్మ!

ఎందుకా సరభసత
ఎందుకా ఔత్సుక్య
మేమి తిందామంచు
ఇలకు దిగుతున్నావు?

సర్వ సస్యాఢ్యమౌ
సువిశాల భారతము
దండిగా జనముతో
నిండి నిబిడీకృతము

ఈలోక మొకనాడు
స్వర్లోక ప్రాధాన్య
మును, బొంది శోభిల్లె
ననుమాట, నిజమేను.

ఆ అల్పజన సంఖ్య
ఆ యజ్ఞయాగాలు
ఆరంభ లీనాడు
లేరనుటనూ నిజము

ఆనాటి స్థితికన్న
ఈనాటి గతి వేరు
నేటి మానవ జీవ
నము దారియే వేరు

జననాల పెరుగుదల
కును-అధిక ఆహార
ఉత్పత్తి మధ్య-ని
ష్పత్తి, అతిపాతమ్ము

పూర్వకాలము కులము
వృత్తియే ధర్మమని
ప్రతివ్యక్తి వస్తు-ఉ
త్పత్తి చేసెడివాడు.

నాడు సంతనవలయు
ననుచు సంతానమ్ము
అత్యధిక సంఖ్య-ను
త్పత్తి చేసెడివాడు

అల బాణయుద్ధాలు
అల ముష్టయుద్ధాలు
అలనాడు జనసంఖ్య
విలువ వాకొన, గాదు.

నేడు యాంత్రిక యుగము
నేడు మేధకె, విలువ.

ఒక యంత్ర మొకపూట
కోటి యెకరము దున్ను
ఒక మిల్లు ఒకపూట
కోటి మీటరునేయు
ఒకటాంకు ఒకపూట
కోటిమందిని చంపు
ఒక ప్లేను ఒకపూట
కోటిమీటరు పర్వు
కంప్యూట రొకపూట
కోటిలెక్కలు చేయు
రాకెట్టు ఒకపూట
కోటియామడ పర్వు
ఒక్క అపోలో చంద్రు
నుపరితలమును దున్నె
ఒక లునాఖోడు-గ్లొ
ముఖము పై పయనించె

నేడు యాంత్రిక యుగము
నేడు మేధకె విలువ
జనసంఖ్య గలుగు, మా
త్రన-లేదులే-విలువ

ఉన్నవాళ్ళు చాలును-ఈ
ఉర్వి కధిక భారమేల?
పోనీ రాని త్రమన్న
పనికిరానిదీ సంఘము

ఈ సంఘం మతతత్వపు
దోషంలో మగ్నమాయె
ఈ సంఘం కులతత్వపు
మోసంలో మగ్నమాయె
ఈ సంఘం అస్పృశ్యత
పాపంలో మగ్నమాయె
ఈ సంఘం పరాన్నభుక్
దోషలతో నిండిపోయె
ఈ సంఘం పరద్రవిణ
ఘస్మరులతొ నిండిపోయె

ఇంక నీకు తావెక్కడ?
ఎట్లామనగల విక్కడ?
పోనీరాని స్త్రే-నీ
పుట్టుచోటు, ఎక్కడన్న?

ప్రిన్సెస్‌లో పుడతావా
ప్రివిలేజన్ పోయెనయ్యో
పదుగురితోపాటు పుడితె
ప్రత్యేకత లేకపోయె

ఎన్నివిధాలా చూచిన
ఈ భూమికి రాగూడదు.
సాహసించి వస్తావా
జాగ్రత! కనువిప్పిచూడు

కాబట్టి జీవాత్మ
కాందిశీకుడు కమ్ము
మానవేతర యోని
కైన-వెదుకుము దారి



# గరీబీ హటావో

గరీబీ హటావో అని
వినగానే ఆనందం
కలుగును, మరి అంతలోనె
కలుగు నిరాశాభావం

బీదరైతు ధాన్యాలను
అమ్మబోతె అగ్గిగాను
కూలివాడు తిండిసరుకు
కొనబోతే కొరివిగాను

తయారైన మార్కెట్టిటు
లవుటకు కారకులెవ్వరు
ప్రజలా ప్రతినిధులా పరి
పాలకులా యెవ్వరు మరి?

ఎరువులధర నింగికెగిరి
తొంగితొంగి చూస్తున్నది
బియ్యంధర యెదిగి యెదిగి
మింటినంటి పోతున్నది

చమురులధర పెరిగి పెరిగి
చదలుతాకి దిగనన్నది
చక్కెరధర హెచ్చి హెచ్చి
చుక్కలంటి పోతున్నది.

పన్నులభారం అప్పుల
భారంతో పస్తులతో
కృంగి నీరసించి, విసిగి
కసిమసంగి క్రోధారుణ
దావానల శిఖాదహ్య
మానహృదయులైన జనులు
నిష్ఠురముగ కంఠమెత్తి.
నినాదాలు చేసినారు.

దోచిదోచి ధాన్యాలను
దాచువారిని హటావో
అంజలితో డబ్బుగుంజు
లంచగొండుల మిటావో
పబ్లిక్‌గా ప్రజలదోచు
డిపార్ట్‌మెంటు, లహటావో

కులమువారికే ఉద్యో
గాల పెద్ద కాంట్రాక్టుల
లైసెన్సుల పర్మిట్టుల
నిచ్చు స్వార్థుల లహటావో

కష్టాలను చిక్కుకొన్న
కటిక పేదవారినుండి
వడ్డికి వడ్డీలు లాగు
కసాయీలను హటావో

తెలిసి తెలిసి అస్పృశ్యత
కులభేదం పాటించే
స్వార్థుల సంఘద్రోహుల
పకడ్, గిధ్‌కో ఖిలావో

అప్పుడు యీ నినాదమ్ము
అందమ్మగు నినాదమ్ము
అందాకా యీనాదము
ఎందుకు కొరగాదు సుమ్ము.



# భావభాసురుడు

సుందరాకారమ్ము
సుకుమార వేషమ్ము
సుమమార్దవము భావ
మమలమ్ము హృదయమ్ము

కష్టజీవుల జూచి
కంటతడి వెట్టునట
దళితమర్త్యుల జూచి
దయను దైవారునట

ఎంత మానవతా స
మంతభద్రుడు ఆతడు
ఎంతకారుణ్య భా
వాంతః కరణుడతడు

మత కులాతీత బ్ర
హ్మసమాజ నిష్ఠుడై
అస్పృశ్యతా నాశ
నార్థియై శక్తియై

తనకవిత తన జీవి
తము సర్వలోక క
ల్యాణార్థమై నిల్చి
నట్టి దేవులపల్లి

కృష్ణశాస్త్రి యతండు
కవితిలకు డాతండు



# మనం మనం

అసలు సిసలు ఆదినుండి
తెలుగులదీ తెలగాణము
తెలుగుజాతి, తెలుగుబాస
వెలుగు కనకమునుముందే
తెలుగుతల్లి ధరియించిన
తొలిగర్భము తెలగాణము

ఆంధ్రరాజు లాంధ్రభృత్య
చక్రవర్తు లిక్ష్వాకులు
వరియించి తరించినట్టి
తీయబోడి తెలగాణము

పశ్చిమ చాళుక్య చక్ర
వర్తులా క్రమించి మురిసి
తెళిగన్నడమని చాటిన
కులుకులాడి తెలగాణము

అచటినుండి వ్యాప్తిపొంది
అంతకంత కాక్రమించి
తూరుపుగా దక్షిణముగ
చొరబారిరి తెలగాణులు

దక్షిణాన వ్యాప్తిపొంది
రాయలసీమాంధ్రు లైరి
తూర్పుదిశను వ్యాప్తిపొంది
సాగరాంధ్రు లైరివారె

తన సంతానమును తానె
భక్షించెడు శార్దూలిని
పోలరాదు తెలుగుజాతి
పోలరాదు తెలుగునీతి

రక్తములో రక్తమాయె
రాయలసీమాంధ్ర జాతి
ప్రాణములో ప్రాణమాయె
సాగరాంధ్ర సంతానము

అసలుఆంధ్ర శబ్దమెవరి
దంటే - తెలగాణముదే
తెనుగు తెలుగు శబ్దమెవరి
దేమిటి - తెలగాణముదే

సమానత్వ మెటుపోయెను ?
సౌభ్రాత్రత ఎటుపోయెను ?
సమానావకాశ దృష్టి
ఎటు పోయెను ? ఎటు పోయెను ?

—o—

# సింహ స్వప్నం

గతరాత్రి కలలోన
గాంధి కనిపించాడు
ఆ రూపమును చూచి
హడలిపోతిని నేను

ఆవైపు ఈవైపు
ఆబలాద్వయము లేదు
చేత కర్రయు లేదు
పాదరక్షలు లేవు

పసివాని చిరునవ్వు
పసిబోలు నగుమోము
మలినమై శుష్కమై
కనిపించినది నాకు

తప్పుచేసినవాడు
తప్పుకో జూచువలె
భయముతో భక్తితో
ప్రక్కొకదిగి నిలిచాను.

పలకరింపగ మనసు
తలచినది తలకినది
చిన్నగా గాంధిజీ
జేజేలు నీ కంటి

వెంటనే కనులలో
విస్ఫులింగముగములు
వెడలినవి నోట వా
గ్బాణములు వెడలినవి

దుష్ట! దురహంకారి
దుర్మార్గ, నాపేరు
ఉచ్చరించిన జిహ్వ
ఊడిపడ లేదురా?

అనగానె సవినయ
మ్మున మనవి చేశాను

సత్యమూర్తీ అహిం
సా మూర్తి యీ రీతి
రెచ్చి నన్నిందింప
వచ్చునా గాంధిజీ
అనగానె గాంధిజి
కనులు నిప్పుకలుమిసె
ముఖమెర్రనై మంట
సెకల మొత్తము లుమిసె

తనువు ఆ పొద మ
స్తమ్ముగా కంపించె
ఓష్ఠముల్ చెదరి ఉ
త్రిష్ఠమ్ములై వొణకె

ఆ దృశ్యమును చూచి
హడలెత్తి పోయాను
పిఱికి తనమున నేను
బిక్కమొగమేశాను

ఏమిటీ ఆరాధ
నేమిటీ ఆటోప
మేల నన్వంచింతు
రెంత మోసము మీది

మద్యపాన నిషేధ
మంతమేల్ సంస్కరణ
మేమి చేసిరి మీరు
మీరు మానవులేనః

ప్రజలు త్రాగిరి ప్రజా
ప్రతినిధులు త్రాగారు
పట్టి శిక్షించేటి
ప్రభువులే త్రాగారు

శిక్ష వేయుట బదులు
లంచాలు భోంచేసి
ఇంటింట బట్టీలు
వెలయింప జేశారు

మగవారు త్రాగారు
మగువలును త్రాగారు
ఆబాల గోపాల
మంతయూ త్రాగారు

మద్యపానము చేసి
మగువలను కొట్టారు
మద్యపానము చేసి
మానవుల నరికారు
పాపాత్ములై యిండ్ల
దోపిడీల్ చేశారు
కన్నియల మాన భంగ
ముల గావించారు

చాలకాలము మనకు
సామ్యవాదము సున్న
సమత కోసము యెన్ని
చావులను చచ్చాము

స్వారాజ్య మొచ్చాక
సమత యేమయి పోయె
స్వార్థమ్ము పెరిగి ని
స్వార్థమ్ము తరిగినది

కులము స్పష్టమ్ముగా
తెలిసికొనుటకు యెన్ని
బాహ్య చిహ్నాలు-తో
కలు పేర్ల ప్రక్కలను

కులభావమీనాడు
బలిసిపోయినయట్లు
అలవర్ణ ధర్మమ్ము
కలనాడునూ లేదు

చదువులకు సీట్లకై
కులము ప్రాధాన్యమ్ము
ఉద్యోగమిచ్చుటకు
కులము ప్రాధాన్యమ్ము
పర్మిట్లు నిచ్చుటకు
కులము ప్రాధాన్యమ్ము
కంట్రాక్టు లిచ్చుటకు
కులము ప్రాధాన్యమ్మె
లక్షణ్గా నిల్పుటకు
కులము ప్రాధాన్యమ్మె

ఉచ్ఛ్వసించిన, కులము
నిశ్వసించిన కులము
కుల శబ్దమున కెంత
బలము కూర్చారిపుడు

ఇట్లాగె సాగితే
యేమగును సంఘమ్ము
ఎపుడు దీనికి విరుగు
డెట్ల సమతకు దారి

అస్పృశ్యతానివా
రణమాట యేమిటి?
నిస్పృహత్వము ప్రబలె
నేటి హరిజనులలో

అస్పృశ్యతా నివా
రణము కావించామ
టంచు వేదిక లెక్కి-
దంచి వేస్తున్నారు

గృహములా భూములా
ఒకటేమి యెన్నొ కో
ర్కెల తీర్చినట్టు ప్రక
టన్లు చేస్తున్నారు

కాని నిజముగ అంట
రాని తనము పరాసు
అయినదా అభివృద్ధి
అయినదా చెప్పుమరి

హౌ డు యూ ఫీల్ ఇన్
(How do you feel in)
థిస్ సొసైటీ అని
(this society)
హరిజనుణ్ణడగవోయ్
అతడేమిటంటాడో

అంటాడు వినుమరి
నిస్సంశయమ్ముగా
తల పగల గొట్టుకొని
చచ్చిపోవాలని
అంటాడు వినుమరి

ఇది నేటి భారతము
ఇవి నేటి స్థితి గతులు
ఇది సర్వతంత్ర స్వ
తంత్ర భారత జాతి

అవకాశ వాదులై
జాతి సంపదనంత
దోచుకొనుటకు కాదు
దాచుకొనుటకు గాదు

సామ్యవాదము ప్రజా
స్వామ్యవాద మటంచు
తీర్మానములు చేయ
తీరునా బాధ్యతలు

సర్వులకు సమముగా
అవకాశము లభించు
మార్గ మన్వేషింప
వలయు నిస్వార్థముగ

ధనమునకు ప్రాధాన్య
మును యిచ్చు సంఘమ్ము
పనికిరాదని నమ్మ
భావికాలము నందు

నమ్మవా-స్వార్థమ్ము
పెంతువా-ప్రతివాడు
ద్వేషించి తిరుగుబా
టు ను లేవదీస్తాడు

ఆ మాట అనగానె
హడలెత్తి పోయాను
అలికి డయినట్లుగా
కనుతెరచి చూశాను

ఘోరం, భయానకం,
కరుణ రస పూరితం,
ఎదుటింటి ఆసామి
కట్టబడి వున్నాడు
నల్లధనమంతాను
కొల్లబోయిన దంచు
లబలబా నోరు బా
దేసు కుంటున్నాడు

# సూక్ష్మశరీరి నెహ్రూ

ఎంత విశాలం ధరిత్రి
అంత బృహన్మూర్తి వీవు
ఎంత ఎత్తు ఆకాశం
అంత ఎత్తు మనిషి నీవు

మా దృష్టికి యీ ధరిత్రి
కుచించుకొని క్రుంగింది
దురదృష్టం ఆకాశం
విరిగి నేల కొరిగింది

ఘూర్ణిల్లెను జనసముద్ర
బడబాగ్ని సమాన దుఃఖ
ఘూర్ణితమై యీ లోకం
నిరాధారమై పాపం !

మానవ హృదయాలంతా
ఒక్క పెద్ద చితి యయ్యెను
దుఃఖజ్వాలాదగ్ధం
నీ శుభ భౌతిక కాయం
ఇంక యేమి మిగిలింది
వట్టి బూడిదే మాకు

మృత్యువులోనుండి జీవ
ముద్భవిల్లునంటారు
వినాశమ్మునుండి పునః
సృష్టి జరుగునంటారు

అట్లాగే మృతిజెందిన
నీదు స్థూల శరీరమున
సూక్ష్మరూప నైనాహూ సం
సృష్టిని జెందును గావుత.



# ఘంటసాల

ఘంటసాల కంఠజనిత
కలనాదం కలగానం
అది కంఠంగాదు వాణి
వీణాజనిత క్వణనం

అది కంఠంగాదు దేవ
దుందుభి నాదమ్ముగాని
అది కంఠంగాదుపాంచ
జన్య నినాదమ్ము గాని
అది కంఠంగాదు శివుని
డమరుక నినదమ్ముగాని

ఆ శారీరం నారద
మహతీ శృతిసోదర్యం
అది తుంబుర నారద-వీ
ణా నిక్వణ సౌందర్యం

నీ కంఠం హావభావ
సాకల్య ప్రతినాదం
నీ కంఠం శృంగారా
ద్భుత వీర ప్రతిరూపం

ఇకమీదట నీ కంఠం
కేవలమది యంత్రస్థం
అయితేనేం నీ కంఠం
అజరం అమరానందం.



## జై దుర్గ-జైకాళి

జై దుర్గ జై కాళి
జై మహిషమర్దనీ
జై గౌరి జై చండి
జై యిందిరాగాంధి

జృంభించి శౌర్య ప్ర
తాపాగ్ని కురిపించి
శత్రు శలభాల
సంఘాతముల వేల్చితే?

ఉత్తుంగ భంగ సా
దృశ్యమ్ముగా పొంగి
ఘూర్ణిల్లి శత్రు పా
ఠీనాల మ్రింగితే

చెలరేగి ద్రోహిపై
నలిరేగి హర్యక్షు
సాదృశ్యమై సైన
హరిణాల చెండితే

కాలాభ్రమై పొంగి
గర్జించి శరవర్ష
ధారలన్ కాడించి
చీల్చి చెండాడితే

వలకంట నెఱమంట
డా కంట రేయెండ
ఒకట విప్లవ జ్యోతి
ఒకట అభయ జ్యోతి

నీవే మహాశక్తి
నీవరాష్ట్ర విభూతి
నీవ యీ పీడిత
ప్రజల ఆశాజ్యోతి



## ఒంటిమిట్ట

అటువైపు పర్వతము
లిటువైపు పర్వతము
లీమధ్యగల గుట్ట
శ్రీమదొంటరిమిట్ట

ఈ యొంటిమిట్ట బ్ర
హ్మేంద్రాది దేవతా
నీక సంసేవ్యమై
నెగడెను ప్రసిద్ధమై

అదె చూడు సుందరీ
ఆపైన గోపురము
దేదీప్యమానమై
దేవయాన విమాన
సంకాశమై కాంతి
సంఘాతమై వియత్
వీధిపై ఎత్తుగా
వెల్గుచున్నది అదిగో

అదె చూడనే పరమ
పదము సోపానములు
రాము కొలుపుకు కొంచు
పోవు సోపానములు

సీతా మహదేవి
శ్రీరామ చంద్రనే
త్రాంబుజమ్ముల కాంతి
పుంజపూతమ్ములవి

పరమహంసల పరి
వ్రాజకుల యాత్రికుల
పరమ భక్తుల పాద
పద్మాంకితమ్ము లవి

అలకృష్ణదేవ రా
యల సతీమణుల పా
దాంగద ధ్వని ప్రతి
ధ్వనుల పూతమ్ములవి

రామభక్తుడు పోత
నామాత్య నిత్య పూ
జార్థ యాతాయాత
పాదపూతమ్ములవి

రామాభ్యుదయ కర్త
రామభద్ర కవీశ
గండ పెండెర పాద
ముద్రాంకితమ్ములవి

వరభక్త కవి మంద
రము కర్తయైనట్టి
వాసుదాసుని పాద
పద్మాంకితమ్ములవి

అల్లదే ఉత్తుంగ
మవు ధ్వజ స్తంభమ్ము
స్వర్గేశు పురముపై
ధ్వజమెత్తి ఆకాశ
గంగా తరంగిణీ
కల్హార పుష్పసం
సేవితమై జయ
స్తంభమైనది సుమ్ము

ఇది మహా మండపము
ఇది ఆకసము నంత
ఎత్తుగా నిర్మితము
ఇది సుధర్మా సమ
జ్యోకంటె గురుతరము

దేవాదిదేవతలు
దేవముని నివహములు
విద్యాధరోప్పరో
గంధర్వ నివహములు
అన్యథా శరణమ్ము
నాస్తి యని యిలకుదిగి
శ్రీరామరక్షకై
ప్రార్థింతురను దినము

అది తల్లి భూజాత
పద పద్మముల జంట
అది తండ్రి శ్రీరామ
పద పద్మముల జంట

జీవాత్మ పరమాత్మ
సాయుజ్యమును పొంది
అందరికి ఆరాధ్య
మయెనంట ఆ జంట

ఈ జంట దర్శనము
మన పుణ్యముల పంట
ఎల్ల దంపతుల నో
ములపంట అదియంట

—o—

## ఆంధ్రకేసరి

ప్రజలు అంటేనే ప్రకాశం
పంతులంటే ప్రజానీకం
ప్రజానీకం-ప్రకాశం-అన
దం-అభేదమ్మనకు అర్ధం

ఆంధ్రకేసరి ఆంధ్రకేనా
అఖిల భారతమునకు కేసరి
అతని గూర్చిన భావమే దు
ర్వార వీరావేశ బీజము

సింహముఖ సదృశము వదనము
సింహగర్జన కంఠనాదము
ఆగ్రహాలంకృతము హృదయము-ఉ
దగ్రమైన ఉదారతత్వము

గాంధియన్నను కాంగ్రెసన్నను
కసిగ కారాగృహము లోపల
త్రోయునాడు స్వరాజ్య పత్రిక
స్థాపనము చేసిన స్వతంత్రుడు

లక్షలక్షలు దేశమునకై
లక్ష్యపెట్టక ధారవోసిన
దేశ సేవాతత్పరుడు ని
శ్శేష పాపుడు, త్యాగశీలుడు

నిర్దయులు. సైమన్ కమిషను
నెదిరి నిలిచిన దేశభక్తుడు
ఎందుజూచిన అందు తానై
ముందుకుఱికిన అభ్యమిత్ర్యుడు[1]

పరాక్రాంతకు భరతమాతకు
పారతంత్ర్యము బాపగా-కాం
గ్రేసు నడిపిన యుద్ధ జైత్రా
గ్రేసరాగ్రేసరుడు కేసరి

ఆంధ్రమాతకు ముద్దుబిడ్డడు
ఆంధ్ర జనహృత్ పుష్పషట్పద
మతడు మానవ మానసౌకస
రాజహంసము ఆంధ్రకేసరి

కులమతాల కతీతమై-ని
ర్మలమునైన హృదంతరముతో
సర్వజనహిత కాంక్షచేసిన
సార్వభౌముడు ఆంధ్రకేసరి

---

[1]జయించు కోరికతో శత్రువులపైకి నడచువాడు.

క్షామపీడిత రాష్ట్రమున సం
క్షేమ పథకములెన్నో నడిపిన
ఆంధ్రకేసరి టంగుటూరికి
ఆంధ్రజాతి నమస్కరించును

సర్వజన సుజ్ఞానదమ్మగు
విశ్వవిద్యాలయము నిలిపిన
ఆంధ్రకేసరి టంగుటూరికి
ఆంధ్రజాతి నమస్కరించును

నేటి భూ సంస్కరణ వాదము
నాడె కేసరి లేవదీసెను
అందుకాతని తలచినంతనె
అఖిల జనులు నమస్కరింతురు

ఎంతకాలం మానవ స్వా
తంత్ర్య భావము ఉండునో-మరి
అంతకాలం ఆంధ్రకేసరి
అంతరంగములందు నిలుచును



# స్వర్గం

ఏచోట శీర్షమ్ము భీతిరహితత్వ చి
త్తౌన్నత్యమున నిక్కి ధీ ప్రదర్శించునో



ఏచోట జ్ఞానము నిరాటంకముగ-భేద
నిరపేక్షగా-దీక్షగాను కొనసాగునో



ఏచోట మానవులు, దాయభావస్వార్థ
చిత్తులై, తమచుట్టు, అడ్డుగోడలు గట్టి
ముక్కలై, వేరువేరుగ చీలిపోలేదో



ఏ జ్ఞానరూప గంభీర సీమలనుండి
సత్యవాక్కులు నిరంతరము వెలికురుకునో



ఏ నిరంతర కృషి కృషిత్వఫలము, సం
పూర్ణత్వమును అందుకొన కౌగిలించునో

ఏచోట హేతుబద్ధ సురూప స్వచ్ఛ ప్రస
వంతి శుష్కాచారరూప మరుభూమి శు
ష్యత్ సైకతములోన తనరూపు మాయదో

ఏచోట భావశుద్ధి క్రియాశుద్ధిముఖ
మై, మేధ నీచేత నడుపబడుచున్నదో

ఆచోటికే స్వర్గధామానికే సర్వ
తంత్ర స్వతంత్ర ధామానికే, ఓ తండ్రి
నా సోదరులనెల్ల నడిపించు నా తండ్రి.

(రవీంద్రుని where the mind is without fear
అన్నదానికి అనువాదం)

